దీర్ఘశలాటుః పు. చిన్ననంబా ధాన్యము.

దీర్ఘలాభవః పు. అవురు శనవు.

దీర్ఘలోహితయష్టికా. స్త్రీ. ఎఱ్ఱచెఱకు. 68; జీలుగుచెట్టు,

దీర్ఘవంశః పు. కిక్కిసగడ్డి, 61, 5,

దీర్ఘవర్షాభూః స్త్రీ. తెల్లగలిజేరు. 67.

దీర్ఘవల్లరీ. స్త్రీ. వృద్ధదారు.

దీర్ఘవల్లికా. స్త్రీ. పేము; దీర్ఘవల్లీ, చూ.

దీర్ఘవల్లీ. స్త్రీ. పెద్దయేటిపుచ్చ; పాతాళగరుడి; తీగెమోదుగ. వం. ,,పాపర్ మాలి,, 61. 3.

దీర్ఘవాలుకా. స్త్రీ. వృద్ధదారు వృ. ప్ర. 61. 2.

దీర్ఘవీజా. స్త్రీ. అనపతీగ; చిక్కుడుభేదము. 33.

దీర్ఘవృంతః పు. పెద్దకాయలుగల శోణాకవృక్షము. 33; పచ్చలొద్దుగ. 67; తీగెమద్ది. 68; శోణాకవృక్షము; పెద్దవేప; తెల్లలొద్దుగ; ఎఱ్ఱచందనపుచెట్టు; స్త్రీ. పటిపుచ్చ. 61. 3; ఫిరంగిచెట్టు. వం. ,,కాంటా అమ్రులీ,, 72; పాలానుగ.

దీర్ఘవృంతకః పు. పెద్దకాయలుగల శోణాకవృక్షము. 33; పచ్చలొద్దుగ. 67; తీగెమోదుగ. 68.

దీర్ఘవృంతికా. స్త్రీ. పటిపుచ్చ. 61 3; ఫిరంగిచెట్టు. వం. ,,కాంటా అమ్రులీ,, 72.

దీర్ఘవృత్తః పు. విష్ణుకంధము
దీర్ఘవృంతః పు. శాంటిచెట్టు; తీగెమద్ది. 67; సరళదేవదారు.
దీర్ఘశరః పు. పచ్చజొన్నలు. 61. 16.
దీర్ఘశాఖః పు. జనపభేదము. 61. 4; ఉలుచెట్టు. 67; ఏపిచెట్టు. 72.
దీర్ఘశాఖికా. స్త్రీ. నీలాప్లిలాయను ఫలవృక్షవిశేషము. 61. 4.
దీర్ఘశింబా. స్త్రీ. చమ్మలీగె. 33.
దీర్ఘశింబికః 61. 16. } పు. బొబ్బర్లు.
దీర్ఘశింబీ. న. }
దీర్ఘశూకః (కకః) పు. తెల్లనైన నిడుపైన శూకము లుగల శాలిధాన్యభేదము 22. సూ. 27; రాజభోగములనెడి శాలిధాన్యభేదము. 61. 23; ఎర్రరాజనాలు.
దీర్ఘసమిుళత్రియః పు. కిక్కిసగడ్డి. 63.
దీర్ఘసస్యః పు. తుమికిచెట్టు. 67
దీర్ఘస్కంధః పు. శాంటిగొట్టు. 61. 9.
దీర్ఘాంకురః పు. రాజభోగములనెడి శాలిధాన్యభేదం. 67.
దీర్ఘాంగీ. స్త్రీ. ముయ్యాకుపొన్న. 40; కానరచెట్టు.
దీర్ఘాంఘ్రిః స్త్రీ; ముయ్యాకుపొన్న. 67.
దీర్ఘాయుః న. పు, బూరుగ

చెట్టు. 61. 8; జీవకమను దుంప. 45; గావిచెట్టు.

దీర్ఘాయుష్కః పు. జీవకమను దుంప. 45. తెల్లజిల్లేడు 61. 10.

దీర్ఘాలర్కః పు. పెద్దతెల్లజిల్లేడు. 61. 10.

దీర్ఘికా. స్త్రీ. హింగుపత్రి 61. 6; ఎద్దునాలికచెట్టు. 61.

దీర్ఘేర్వారుః పు. పెద్దసొరకాయ పెద్దదోస. 61. 7.

ద్వీపః పు. కంకోలపుచెట్టు. 67.

ద్వీపకర్పూరః (రజః) పు. చీన కర్పూరము. 61. 12.

ద్వీపకర్జూరం. | న, పెద్దఈత
ద్వీపజం. | డచెట్టు, ద్వీపాంతర కర్జూరము. 61. 11

ద్వీపశత్రుః పు. పిల్లపీచర 61. 4.

ద్వీపసంభవః పు. కంకోలపు చెట్టు; జీలకర్ర; స్త్రీ. పెద్ద ఖర్జూరపు చెట్టు.

ద్వీపస్థః పు. కంకోలపుచెట్టు. 61; స్త్రీ పిల్లపీచర 61 4. పిండఖర్జూర వృక్షము. 61; 11.

ద్వీపవచా. స్త్రీ. చోపచీని

ద్వీపికః పు. చిత్రమూలము. 75; స్త్రీ. పిల్లపీచర. 61. 4.

ద్వీపిశర్మా. న్. పు. చిత్రమూలము.

ద్వీపినీ స్త్రీ. వటపత్రియనెడి తెలకపిండి మొక్క భేదము 60; పిల్లపీచర.

ద్వీపిపలాశః పు. కొస్తికర్ణమనెడి మోదుగచెట్టు భేదము. „ముష్కకస్నుగ్వా రాద్వీపి పలాశభవ కింశకాః„ 63. గూ. 15. ముష్కకాది. గ.

మూలిక. 61. 5.

దుగ్ధబీజా సీ. పాలానుగ.

దుగ్ధరుహాః పు. తిలకపుచెట్టు. ౯౬.

దుగ్ధవిదారీ. సీ. పాలనేలగుమ్మడు.

దుగ్ధవీటః ఖా. ఊచబియ్యము న ఉపయోగించెడి పచ్చి జొన్నలు. మొ,61.16; సీ. పాలానుగ.

దుగ్ధాధ్యా. సీ. క్షీరకాకోలి.

దుగ్ధామ్రః పు. పాలమామిడి. 61. 15.

దుగ్ధాశ్మా. న. పు. కొవ్వెరాయి. 61. 18.

దుగ్ధాక్షః పు. క్షీరస్ఫటికమనెడి స్ఫటికభేదము. శబ్దార్థకల్పతరువు

దుగ్ధికా. సీ. పిన్నపాల. 40; ఏటిపుచ్చు; చేదానప. ౩౫;

పాలచెట్టు. 47.

దుగ్ధినీ (నికా) | సీ ఎర్రఉత్తరేణి. 61. 4;
దుగ్ధినీకా.... | పాలానుగ; చేదానుగ.63.

ఉ. 37. 86. శ్లో.

దుగ్ధీ. సీ. దుగ్ధభద్ర. సీ. చూ; పిన్నపాల. మూ. దుగ్ధికా 75.

దుచ్ఛకః. పు; ముఱయాలెడి గంధద్రవ్యము. 45; తాళిసపత్రి. ౬౯.

దుత్తూరః (రకః). పు. ఉమ్మెత్త.

దుద్రుమః. పు. ఆకుపచ్చనీరుల్లి.

దురభిగ్రహాః. స్త్రీ. ఉత్తరేణి. ౬౧. 4. సీ. ప్రి 61. ౩౬; ఎర్రఉత్తరేణి; సీ. దూలగొండ; పెద్దదూలగొండ; ఆనప. 67.

దురవగ్రహా, స్త్రీ. కూలగొండ,
దుర్గః పు. గుగ్గిలము. 61.12;
 స్త్రీ. నీలిచెట్టు; నల్లసుగంధి
 45. విష్ణుక్రాంతము. 72.
దుర్గంధః. పు. మామిడిచెట్టు.
 72. నీరుల్లి. 40; న. సౌవ
 ర్చలలవణము; ఏతి. స్త్రీ. బా
 వంచి. 67.
దుర్గంధకాష్ఠః పు. కంపుచం
 డ్రి. 68.
దుర్గంధిః పు. మామిడిచెట్టు;
 న. సౌవర్చలలవణము. 67
దుర్గికారకః. పు. వృక్షవిశేష
 ము అను గుగ్గిలపుచెట్టు.
 74.
దుర్గనామా. న్. పు; గుగ్గిల
 పుచెట్టు;
దుర్గపుష్పీ న్. పు. ,, కేశపు
 ష్పా,, అనెడి వృక్షవిశేష
 ము. 72.
దుర్గ్రహా. స్త్రీ. ఉత్తరేణి. 61.

 4. స్త్రీ. పత్రి40; స్త్రీ. తుంగ
 ముస్తలు. 61. 23.
దుర్జరః. పు. వెల్లుల్లి; స్త్రీ. చి
 న్నవెక్కుడుతీగె. 61. 3.
దుర్జరఫలం. న. దోస. 67.
దుర్జరః. పు. పాలతుత్థము.
దుర్దర్శః. పు. నల్లజీడిచెట్టు.
 67.
దుర్దనం. న. ఋషభమనేదుం
 ప. 68.
దుర్ధరః. పు. ఋషభమనే
 దుంప. 45; నల్లజీడిచెట్టు;
 పాదరసము. 67.
దుర్ధర్షా. స్త్రీ. నాగదమనము.
 61. 5; కంథారిఅనేచెట్టు.
 61. 8; ఉప్పి. ప. నల్ల
 వుప్పి.
దుర్బలా. స్త్రీ; నీటిదిరిశెన. 40.
దుర్భరా. స్త్రీ. చిన్నవెక్కుడుతీ
 గె. 61.
దుర్నామాపహా, స్త్రీ. తెల్లగరిక.

దుర్నదా. సీ. చిన్నవెక్కుడు తిగె.

దుర్నామా॥ న. సీ. పిల్లపీసర 61. 4.

దుర్నరః పు. రావిచెట్టు. 67; పిల్లపీచర. 61. 4. తెల్లగరికె. 61. 8; గరికె 61.

దుర్లభః పు. కచోరము. 67; కర్పూరపుబెండ; సీ దూలగొండ. 61. 4; ఎర్రదూలగొండ. 67; తెల్లములక.

దుర్వర్ణం. న. వెండి 33; కూతురుబుడమ. 61. 4; చక్రి పర్తికూర.

దుర్వర్ణం. న. వెండి. 33; కూతురుబుడమ 61. 4.

దుర్వర్ణపత్రసరం. న. కూతురుబుడమ.

దుర్వారా. సీ. గంటుభారంగి. 68.

దురావర్షః పు. తెల్లావాలు; అర్కపుష్పి. 61. 5.

దురారుహః పు. కొబ్బరిచెట్టు; కొటిచెట్టు; వెదురు. 61. 23; సీ. ఖర్జూరపుచెట్టు. 68; ఈతచెట్టు; పు. మారేడుచెట్టు. 61. 11.

దురారోహః పు. బూరుగచెట్టు 5. పత్రి. 27; మధుఖర్జూరపుచెట్టు. పు. పత్రి. 37 సీ పత్రి. 40; పు. కొటిచెట్టు. 68; సీ. ఈతచెట్టు; సీ. వల్లివృక్షము. 61. 8.

దురాలంభా. | దురాలభా | సి. చిన్నరేగడిదూలగొండ. 61. 4; దూలగొండ;

పత్రి చెట్టు; స్పృక్కయ
నెడి గంధద్రవ్యము. 73;
తీటకళివెంద.

దుర్గ్రాహ్యోదః 67 | పు. నే
దుర్గ్రాహ్యః 61. 12. | లగుగ్గి
లము.

దుర్నామా. స్త్రీ. చంగల్వకో
ష్టు

దుర్నామారిః పు. కంద. 61.
7.

దుర్నామా. స్త్రీ. తెల్లగురివెంద.
42. 2.

దురితద(శ)మనీ. స్త్రీ. జమ్మి చె
ట్టు 61. 8.

దుర్ధ్రితా. స్త్రీ. లతావిశేష
ము. 24.

దుర్భిక్షవల్లభః పు. చిర్రికూ
రభేదము.

దుర్బిలా. స్త్రీ. తెలమసంపి. 67.

దుర్వ్యాధిహరా. స్త్రీ. కర్పూరపు
కచోరము. 67.

దుర్దురః పు. పాలతుత్థభేదము.

దుర్ద్రుమః పు. పచ్చవీరుల్లి. 61.
7.

దుర్ముఖా. స్త్రీ. తెల్లగురివెంద
67; కానరచెట్టు.

దుర్మూలః పు. ముంజగడ్డి.

దురోహః. న్. పు. నాగకేసర
వృక్షము 67.

దురోన్నికా (ఘా) స్త్రీ. తెల్లగురి
వెంద. 67.

దురోన్మహా. స్త్రీ. తెల్లగురివెంద
61. 4; ఎర్రగురివెంద.
67,

దుశ్చక్రిః పు. ఎల్లేసు. 61. 4.

దుష్ఖదిరః పు. కంపుచండ్ర.
6_. 3.

దుష్టం. న. చంగల్వకోష్టు. 72

దుష్టసంస్పర్శః పు. అరు

దొండ.

దుష్టస్పర్శా. స్త్రీ. వాకుడు.

దుష్పుత్రిః పు. చోరకము. 61. 12; చండాలకందము; ఓమము భేదము. 67.

దుష్పర్శః పు. చిన్న రేగడిదూలగొండ.

దుష్ప్రదం. న. సౌవీరాంజనము. 68.

దుష్ప్రధర్షణీ. స్త్రీ. వాకుడు. 61. 4; వంగచెట్టు. 33. ములక. 40.

దుష్ప్రధర్షా. స్త్రీ; దూలగొండ 61. 4; ఖర్జూరపుచెట్టు 61, 11; ఈతచెట్టు.

దుష్ప్రధర్షిణీ. దుష్ప్రధర్షణీవలె.

దుష్ప్రవేశా. స్త్రీ. కంథారిఅనేచెట్టు. 61. 8; కలబంద. 67.

దుష్కులః. పు. } చోరకము
దుష్కులీనః. పు. } 61. 12
దుష్పుత్రః. పు. }

దుస్పర్శః. పు. దూలగొండ. పు. పు. 5; పు. గచ్చపొద. 61, 8; తీటకశింబ. చిన్నరేగడిదూలగొండ, స్త్రీ. పెద్దదూలగొండ. 61. 3, ఎర్రిదూలగొండ 61. 4, కలిగొట్టుచెట్టు, ఆకాశవల్లి, కొం, అంతరమర; అడవిరేగు, 61; వాకుడు. 61. 4; నేలములక; తేలుమణిచెట్టు.

దుస్సహా. స్త్రీ. నాగదమనము.

ద్యుతిమణిః } పు. జల్లేడుచెట్టు.
ద్యుమణిః } 59. విద్యాధరరసమందు.

ద్రుః పు. వృక్షసామాన్యము. 2.

పు. ప్రి. ,,దూర్విన్నప్లే కామరూపిణే,, 65.

దృంపూః (భూః) సీ.వజ్రము 93.

దృక్కటః పు. ఓకడాయునెడి మొక్క. 27.

దృక్ప్రదం. న. సౌవీరాంజనము. 61. 13.

దృక్ప్రసాదః ప్న. అడవిఉలవలు. 61. 5; కులుత్థాంజనము. 61. 13.

దృఢః ప్న. కూతురుబుడమ. 61. 4; బూరుగచెట్టు;ధవయనెడి వృక్షము;ఇనుము 72; వజ్రము. 67; సీ.నేలతాడిగడ్డ.33; నేలఉశిరిగ. 67; పటిగ.

దృఢకంటకః ప్న.ఖర్జూరపుచెట్టు. 67; ఉడుగచెట్టు. 74; వాకచెట్టు.

దృఢకాండం. ప్న. పెద్దకామంచిపూరి. 61. కః పు. పు. వెదురు. 61. 7; సీ. పాతాళగరుడి. 61. 3.

దృఢకాంతికరః పు. గోధుమలు.

దృఢగర్భం (ర్భకం) న. వజ్రము. 33.

దృఢగ్రంధిః పు. వెదురు. 61. 7.

దృఢగాత్రికా. సీ. పటిగపంచదార. 75.

దృఢచ్ఛదః ప్న. తాటిచెట్టు. 61. 9; పెద్దకామంచిపూరి. 61. 8.

దృఢతరుః పు. ధవఅను వృక్షవిశేషము. 61. 9; వెలమ

దృఢత్వక్. చ్. పు. జొన్నచొప్ప. 61. కః ముంజగడ్డి. 67.

దృఢతృణః పు. ముంజగడ్డి; సీ

బల్బజమను గడ్డి. 61. 8.
దృఢనీరః (లః) పు; కొబ్బరిచె
ట్టు. 61. 11.
దృఢపత్రః పు. వెదురు. 61.
7; ముంజగడ్డి. 67.
దృఢపత్రీ. సీ. బల్బజమనుగడ్డి
61. 8.
దృఢపదా. సీ. నేలఉశిరిగ;
గండలియ్య 61. 3—5
దృఢపదీ. సీ బదనిక. 61.5.
దృఢప్రరోహః పు. జువ్విచె
ట్టు. 61. 11.
దృఢపాకీ. సీ. గండలియ్య.
దృఢపాదా (దీ) సీ, నేలఉశి
రిగ, గండలియ్య 61.
3—5.
దృఢపుష్పా. సీ. గుచ్ఛకంద
ము. 67.
దృఢఫలః పు. కొబ్బరిచెట్టు.
61. 11; ఇండుపుచెట్టు.
67; వెలగచెట్టు.
దృఢబంధినీ సీ నల్లసుగంధి
7౨.
దృఢబాలుకం న. కూతురు
బుడమ. 61. 4.
దృఢబీజః పు. తుమ్మచెట్టు;
తంటెపుమొక్క. 61. 8;
కొబ్బరిచెట్టు. 63; జామి
చెట్టు; సీ. గోరుచిక్కుడు;
పు రేగుచెట్టు. పు. పత్రి.
61. 11; న. రేగుపండు.
దృఢబీజకః పు. కొబ్బరిచెట్టు.
దృఢభార్గవకం. న. వజ్రము.
61. 13.
దృఢమాలా. సీ. నేలఉశిరిగ.
67.
దృఢమూలః పు. ముంజగడ్డి;
మంథానకమనేగడ్డి. 61.
8; కొబ్బరిచెట్టు. శబ్దార్థక
ల్పతరువు; వెణుతురుచెట్టు;
న వల్ల వట్టివేళ్ళభేదము.
దృఢరంగా (గదా). సీ. పటిక.

61. 13; 40.

దృఢఫలతా. సీ. పాతాళగరుడి.
61 3.

దృఢపల్కః పు. పోకచెట్టు.
61 11; చిరుపసన 61. 9;
సీ. మాచిక. 61. 1.

దృఢవల్కలః పు. దృఢపల్క
శబ్ద. పు. చూ.

దృఢవల్లీ పు. ముంజగడ్డి. 67.

దృఢబీజః దృఢబీజః చూ.

దృఢవృంతః | పు. కొబ్బరిచె
దృఢవృక్షః | ట్టు. 67.

దృఢస్కంధః పు పాలచెట్టు.
24; 61. 1.

దృఢస్థితిః పు. కొబ్బరిచెట్టు.
61. 11.

దృఢసూత్రికా. సీ. చాగచె
ట్టు. 72.

దృఢతూరా. సీ. ఇల్పజపానుగ
డ్డి. 61. 8; పు. ముంజగ
డ్డి. 67.

దృఢాంగం న. వజ్రము
61. 13.

దృఢారంగా. సీ. పటిక. 10.

దృఢారుహాః పు. తుమ్మచెట్టు.

దృతం స్త జీలకర్ర. 67; 72.

దృతిధారకః పు. వం. ,,ఆక
న్పాతా,, 7!. అనగా
జిల్లేడు. మూషికారాపుః
చూ.

దృశత్. ద్. సీ. రాతిసామా
న్యము. 2

దృశాలంకృత్యం. న. పద్మము.
7.

దృశ్యా. స. పెద్దదూలగొం
డ 67

దృశోపమం. న. తెల్లపద్మ
ము. 72

దృషత్. ద్. సీ రాతిసామా
న్యము. 2.

దృష్టస్తుతి. సీ. శిమ్మడీయను
చెట్టు. హిం. ,,చంగోనీ,,

వం. ,, సే (శే) గుడీ,, 61.4.

దృషత్సారం న ఇనుము. 61. 13.

దృషదర్భః పు మరకతమణి.

దృషద్భేదః పు. హోస్తిజోడి యనెడి పిండి కొండభేద ము హిం ,,హోధాజోడీ; 67. ఇదిరసబంధమునకు వళ్యము మొ! వాటినిజేయును, సాలగ్రామ నిఘంటువులో కంపశాకవర్గులో పఠింప బడినది.

దృష్టికృత్. త్ | న. చామంతి-గులాబీ మొ! చతుర్విధ స్థల

దృష్టికృతం.... |

పద్మములు. 72; 73; పౌండరీకము.

దృష్టోపకారిణీ. పెద్దనీలి.

దేవః పు. పాదరసము 61. 13; కలుగానుగ; నీ. అశనపర్ణి అనగా అపరాజితా లతః మెట్టతామర. 72; సహదేవిః నేలానుగ; పెద్ద పాదర

దేవకః పు. దేవతుమ్మి; విరిగి చెట్టు.

దేవకర్దమః పు, పంచసుగంధ ములు (నమభాగములైన శ్రీచందన—మలయుచందన—అగరు—కర్పూర కుంకుమపువ్వులు) 61 22.

దేవకాష్ఠం. న. దేవదారు. 333. కాష్ఠదారుఅనెడి దేవదారు భేదము. 61. 12; సరళదేవదారు.

దేవకుంభః పు | దేవకుంభాయనెడి మొక్క. వం. ,, శేత్ వడ్,, కొంకణములో దీనిని ,,గంధప్రసారణీ తుం

దేవకుంభీ. నీ. |

బా॰, అని వాడుదురు. హిం, ,,దణ్ పాలా॰,, ఇది తుమ్మికూర గుణములు గలది. 67. ఇది పెద్దతుమ్మికూర భేదము. ద్రోణకు తుంబకా. చూ. 68.

దేవకుక్కుటకః పు. చంచలికూరభేదము. వం. ,,శుశునిశాక్,, ,,కురడు,; 67.

దేవకుతుంబకః. పు. 67.
దేవకురుంబా. సీ. 61, 5. | పెద్దతుమ్మికూర.

దేవకుసుమం. ష్న. లవంగము. 61. 12.

దేవగంధకం. న. కామంచిగడ్డి. 67.

దేవగంధా. సీ. మహామేద. 61. 5; ష్న. గోడపాల. 67.

దేవగంధికా. సీ.
దేవజగ్ధం(గ్ధకం) న. 2.
దేవజగ్ధికా. సీ. | కామంచి పూరి.

దేవతర (రు) ణీ. సి. పెద్దచామంతి 67; గులాబీభేదము

దేవతరుః పు. రావిచెట్టు 27; కాండేగుచెట్టు. 67; మందారవృక్షము; పారిజాతము; దేవదారు; హరిచందనము. 2.

దేవతా. సి ఉమ్మెత్త. 67.

దేవతాండః పు. డావరడంగి. 42. 1.

దేవతాకుసుమం. న. లవంగము; దేవతాలుసీయనడిగంధద్రవ్యము. 2;.

దేవకాండకః (డకః).
33; 65.
దేవకాండికా సీ.
దేవకాండీ. సీ. 68.
| డావర
| దంగి.

దేవకాషుణిః పు. మహాదే
ద. 67.

దేవకాళీః పు. డావరదంగి

దేవదండా. 61. 4.... | సీ. జబి
దేవదండోత్పలా. 61.. | లిక బీర.

దేవదగ్ధం. న. కామంచిపూరి
73. ములుపోందుగ భేద
ము. 67.

దేవదత్తః. పు. పేకొట్టు.

దేవదగ్ధకం. న. కామంచి
పూరి.

దేవదాసీ. సీ. డావరదంగి. 47.

దేవదారు. పు. దేవదారు వృ
క్షము. 61. 12. పు. ప్రి.
,,అముంపురః పశ్యసి దేవ
దారు,, రఘువంశములో
కాళిదాసుఁడు

దేవదాఋకం న. సరళ దేవ
దారు.

దేవదారు చరః. పు. కొండగ్రే
గుచెట్టు.

దేవదాళిః. (ళికా) | సీ డా
దేవదాళీ .... ..... | వరదం
గి 40; కలుగానుగ. 67.

దేవదాసీ. సీ. అడవి మా
దీఫలవృక్షము, 61. 11.

దేవదుందుభిః. పు. ఎర్రతుల
సీ. 47; కృష్ణతులసిః 67;
తెల్లగురివెంద. సీ. గంధ
లియ్య.

దేవద్రుమః పు, దేవదారు.
40. మ. 1,

దేవదూతా. (తీ). సీ. అడవి

మాదీఫలవృక్షము. 61. 16.

దేవద్రోణీ. సీ. పెద్దతుమ్మికూర. 61. 5.

దేవధాన్యం. న. తెల్లజొన్నలు. 61. 16.

దేవధూపః. పు. గుగ్గిలము. 33 సర్జరసము. 67; గుహింపా కుగుగ్గిలము.

దేవనం. న. పద్మము. 72

దేవన(నా)ళః. పు. పెద్దరెల్లు సగడ్డి. 61. 8.

దేవనిర్మితా. సీ. తిప్పతీగె. 61.

దేవపత్నీ. సీ. ఎఱ్ఱదుంపలు, మధ్యాలు అనేదుంపలు. 27.

దేవపత్రీ. (త్రికా) సీ. స్పృక్కయనే గంధద్రవ్యము 67.

దేవపర్ణం. న. మాచిపత్రి; స్పృక్కయనే గ్రంధద్రవ్యము. 61. 10.

దేవపాడాఢ్యః. పు. వెంగచెట్టు.

దేవప్రియః. పు. పచ్చగుంటగలగర. 61. 4; పచ్చవత్తి వేళ్ళు అవిశెచెట్టు; సీ. తమాలపాకుల తీగె. 67.

దేవపుత్రీ (త్రికా). సీ. స్పృక్కయనే గంధద్రవ్యం 67.

దేవపుష్పం. న. లవంగము. 67. జీర్ణజ్వర. చి.

దేవపుష్పీ. సీ. „దేవహాళీ,, యనెడి పుష్పవిశేషము.

అనాపిక్క చెట్టు. ;; దేవపు
ష్పీఖోలః త్రిం,, 2.. వా
తవాస్తిథి. చి; స్పృక్కయ
నే గంధద్రవ్యము.

దేవబలా. స్త్రీ. పెదముత్తవపు
లగము; కలు..నుగ. 61.
4—.

దేవభవనం న. రావిచెట్టు.
72.

దేవభూతః పు. అడవిమాదీఫల
ము.

దేవమణిః పు. మహామేద 3;
6. 5; మేద. 67.

దేవమణీ. | స్త్రీ. మహా
దేవమాత్రా 57. | మేద

దేవమిత్రః పు. మద్దిచెట్టు. 67.

దేవరాజాశనాఖ్యః పు. గంజా
యి. 55.

దేవలతా. స్త్రీ. మల్లి; నేపాళ
దేశపు అడవిమల్లి. 72.

దేవలాంగు (గూ) లికా. స్త్రీ.
జెలుమణిచెట్టు. 61. 9;
చిన్నఒడ్డి. 67.

దేవవల్లభః పు. సురపొన్నచె
ట్టు. 2.

దేవవృక్షః పు. గుగ్గిలపుచెట్టు.
45; రేగుచెట్టు. 67; ఏడా
కులరటి. 27; మందారవృ
క్షము. 45.

దేవశాలిః పు. సుగంధికమను
శాలిధాన్యము. 67.

దేవశేఖరః. పు. దమనము. 61
10.

దేవశ్రేణీ. స్త్రీ. చాగ. 61, 8.

దేవసర్షపః. పు, దేవసర్షపమ
నెడి ఆవాలభేదము. 61.
9; సైంధవలవణము. బూ
దీఫలపు చెట్టు; కానిచె

ట్టు; కొండకళాల. ౬1. 13.

దేవసహా. సీ. సహాదేవి; పెద్ద ముత్తవ పులగము.61.4; పచ్చసహాదేవి.65. కలుగానుగ. 61. 5. పొడ రసము.

దేవసృపా. సీ. మద్యము 93

దేవతా్మ స్. పు. రావిచెట్టు 72.

దేవాదనీ. ? పాపర.

దేవాద్వయం. ? సహాదేవా (పెద్దముత్తవపులగము).. విశ్వదేవా, (జిబిలికబీర) 63. సూ. 16. విదారాద్యి ది. గ. అరుణదత్తుడు.,,వృక్షేప దేవాహ్వాయ,, అను చోట ,, దేవాహ్వయ,,అని కూడ పాఠముగలదు.

దేవాద్రోణా. సీ. పెద్దతుమ్మి కూర, 68.

దేవాభీష్టా. సీ. పోకచెట్టు.67. తమలపాకులతీగె. 72

దేవార్హం. న. మాచిపత్రి. 61. 10; సీ. పెద్దముత్త వపులగము. 61. 4.

దేవావాసః. పు. రావిచెట్టు. 27.

దేవాహ్వః (హ్వయః). పు. దేవదారు. 63. సూ. 1?;

దేవ్యా సీ. కురయనేడి గంధద్రివ్యము; బ్రిహ్మి 67.

దేవికా. సీ. ఉమ్మెత్త చెట్టు.40; తెల్లసహాదేవి

దేవితా. సీ. ఉమ్మెత్త. 40.

దేవీ. సీ. లింగదొండ; గొడ్డు ఆగాకర, చాగ. 61. 3; తునదిమన్ను. 53; స్పృ

| | |
|---|---|
| ద్రోణీదళః ౧౦. | పు. మొగ |
| ద్రోణీలః 67. | లిచెట్టు. |
| ద్రోణీలవణం. | న. ద్రోణీ |
| ద్రోణీయం. | లవణము. |

61. 6.

దాండికా. స్త్రీ. బీర, 67.

దార్ధికం. న. పిప్పలిపాలవేరు. 63. ఉ. 37

దార్వా (ర్వీ)ణం. న. మిరియపుచెట్టు; దూర్వారసము; గరికివేళ్ళ స్వరసము; గరికిగడ్డి. 65.

దాఘలేయః. పు. గ్రంథిపర్ణపువేరు. 67.

దాత్రం, న. బీజసామాన్యము. 16.

| | |
|---|---|
| దాణం. 61. 6 | న. ద్రోణీ |
| దాణీలవణం.... | లవణము. |
| దాణేయం.... | |

శ్లో॥ సంభాష్యేవన ద్రోణా ద్యాః.... .... .... ....॥

ధ.

ధంటీ ధటీ. చూ.

ధటః (టకః). పు ధనజానున్నతులవిశేషము 67.

ధటీ. స్త్రీ. వల్కలము అనగా నార 67.

ధత్తూరః పు ఉమ్మెత్త 61. 10.

ధనం, ప్న. మిరియాలు. 67. ప్న. ధనియాలు. నీ. ప్రి 67; పచ్చిధనియాలు.

ధనంజయః పు. లుద్దిచెట్టు. 61: 9; 67; చిత్రమూలము. 47.

ధనకం. న. ధనియాలు. 67.

ధనదః పు. నీటిపేముభేదము. వం. ''నముద్రఫల్'', ౬1. 10.

ధనదాక్షీ. స్త్రీ. కలిగొట్టు. ౬1. 10; గచ్ఛపాద. ౬1. 8.

ధనద్రుమః. జెముదు.

ధనపత్రః. పు. తెల్లగలిజేరు.

ధనప్రియా. స్త్రీ. కాకిచేరేడు. ౬౬. 11.

ధనశ్రేణీ. స్త్రీ. దింటెన.

ధనస్య (స్వ) కః. పు పల్లేరు. 12.

ధనహారః. పు. గ్రంథిపర్ణము; పారసీకఓమము. 67; చోరకము. 40.

ధనహా (హో) రీ. స్త్రీ. పారసీక ఓమము; గ్రంథిపర్ణభేద ము; చోరకము. 2.

ధనహృత్. త్. పు. చండాల కందము. 67.

ధన్వః. పు. ఏటిచెట్టు. ౬1. 9; న. లైవదుముస్తలు. 2౦. 12; స్త్రీ. ఉసిరిగ. 45; న్న.

ధనియాలు. స్త్రీ. ప్ర. 93.

ధన్వయాసకః. పు. పిన్నరేగ డిదూలగొండ.

ధన్వవృక్షః. పు. తడచెట్టు

ధన్యాకం న. ధనియాలు. 32

ధనికః పు. ధనియాలచెట్టు. (కొత్తిమిరి) 61. 6; క్రీ. పేంఖణము. 72; స్నా. ధనియాలు. న. ప్రత్తికం దబీజధనికే,, 35. నన్ని జ్వర. చి. అష్టాంగ కషాయ మందు. సీ. వ్ర. 1. 2.

ధనీ. సీ. 67..... } వచ్చి ధని
ధనీయకం. న. 68. } యాలు:

ధనియాలు.

ధన్వీ. స్. పు. దూలగొండ.

61. 4; మదిచెట్టు 61. 9

పొగడచెట్టు 61. 5;

ధనుః. స్. పు. ప. ఉ, పు. నల్లజీడిచెట్టు; సారచెట్టు. 45; చాగచెట్టు.

ధనుఃపటః. పు. సారచెట్టు. 61 11; 2.

ధనుంధతు. న. జలము.

ధనుపటః. పు. సారచెట్టు. 61; 3.

ధనుర్లతా. స్త్రీ. సోమలత 61. 11.

ధనుర్మాలా. స్త్రీ. చాగ. 72.

ధనుర్న్యాసః. పు. దూలగొండ. 33.

ధనుర్వృ (ర్వ్రీ) జః. పు. నల్లజీడిచెట్టు. 61. 11.

ధనుర్గుణా. స్త్రీ. చాగ. 72.

ధనుర్ద్రుమః. పు. వెదురు. 61. 7.

9; వెదురు; నల్లజీడిచెట్టు.

రావిచెట్టు. 61. 11.

తేడచెట్టు.

ధనుశ్శాఖా. స్త్రీ. చాగ. 72.

ధనుశ్శ్రేణి స్త్రీ. 33; పెద్దవేటి పుచ్చ. 61; 8.

ధనుర్వృతః. పు ధనుర్వంగము నున్నవిశేషము. 47; 61.

పక్షాం ,,ఇతి,, అనిచ:—చవ్యము, ఉష్ణవీర్యము, కటురసము, లఘుగుణముగలది. నోటికి రుచిని పుట్టించును. దీపనకారి, క్రిమిరోగము - కాస - శ్వాస - శూల, వీటిని హరించును. తథాచోక్తం. 81:—చవ్యం స్వాదుష్ణకటుకం లఘుశోధన దీపనం జంతూదర శోషఘ్నం శ్వాస శూలార్తి కృంతనం ,,ఇతి,, కించ:—పిప్పలిమూలము వలెనె చవ్యకముగూడ పనిజేయును. విశేషముగా గుదరోగములను పోగొట్టును. దీని ఫలశ్రులు, విషమ - శ్వాస - కాస - క్షయ, వీటిని హరించును. తథాచోక్తం. 82:—పిప్పలీమూల వత్తస్య విశేషాద్గుద జాపహం, చవ్యఫలం గరశ్వాస కాసక్షయ వినాశనం ,,ఇతి, ఏతచ్చ. 78:—చవకం కటుకం చోష్ణం రుచ్యం చాగ్నేశ్చ దీపనం, లఘూక్తంచ క్రిమిశ్వాస వాతకఫాపహం జ్వరార్శః (మూలవ్యాధి) శూలశమనమృషిభిః పరికీర్తితం అన్యేగుణాస్తు

విజ్ఞేయా పిప్పలీమూల వద్బుధైః ,,ఇతి,,

* విశేష వివరణము:— యిది, పాండువు - ఉబ్బు-కుష్ఠు - హృద్రోగము - అగ్నిమాంద్యము - జ్వరము,పీటిని జయించును. వీర్యవృద్ధి జేయును. వాత పైత్తిములను శమింప జేయును.

* స్వానాపాదులు:— చవ్యము అనగా గజపిప్పలి వేరు, 86 నూ. 38. అ. యిది దూర్వాగడ్డివలె నేలపై తీగెబ్రాకు చూ గుంపుగుంపునకు మొక్కలు లేచెడి ఓషధివిశేషము. దీని కాయలను గజపిప్పలి యనియు వాడుదురు. ఉక్తంచ:—చవి కాయాః ఫలం ప్రాజ్ఞైః కథితా గజపిప్పలీ ,,ఇతి,. దీని ఆకులు కోమలముగను, పలుచగను అరటియాకుల ఆకృతిగలవై పొట్టిగను చిన్నవిగను యుండును. ఆకుచుట్టూ అంచున నుగ్గు నుగ్గులుగా నుండును. యిది మలబారు ప్రాంతములయందు

పెరుగును. కొందరు చవ్యమనగా మిరియపుతీగె వేళ్ళనుగా చెప్పుదురు. మోతాదు ఒకటికి మొదలు నాలుగు మాషములయెత్తువరకు.

13 గజపిప్పలి:—శ్రేయసీ, గజపిప్పలీ. సం॥ గజ. పీపల్. హిం॥ గజపిపుల్. బం॥ గజపిప్పలీ, మిర్ వేల్ చేపింపళ్లి మ॥ గజతిప్పిలి క॥ గజపీపర్. గుజ॥ ఆనైతిప్పలి. అ॥ సిండాప్సస్ అఫిసినేలిస్, హూకర్ [illegible] స్, [illegible] పెద్ద [illegible]

* దీనిగుణము:—గజపిప్పలి కటురసముగలది. వాత. శ్లేష్మములను హరించును. అగ్ని దీప్తి జేయును. ఉష్ణవీర్యముగలది. అతిసారము - శ్వాస - కంఠరోగము - క్రిమి, వీటిని

గుమ్మడు. 23-స్త్రీరోగ-చి.
ధరాఫలః. పు. కర్మరంగి. 61.
ధరాఫల్గుః. స్త్రీ. వంగచెట్టు. 68.
ధరామరశిరోత్తమం. న. పాదరసము.
ధరారంభా. స్త్రీ. అడవిఅరటిచెట్టు.
ధర్మిణీ. స్త్రీ. రేణుకలు. 61.
ధరుణః. పు. జలము. 45
ధర్త్తూరః పు. తెల్లఉమ్మెత్త. 67.
ధలండః (డకః). 72. } పు.
ధలమంకరః 45. }
ధలండమనెడి ఊడుగచెట్టు భేదము.
ధవః. పు. ధవఅనెడి వృక్షము. 47; చంద్రచెట్టు. 59-మృత్యుంజయలోహమందు.
ధవనీ. స్త్రీ. కోలపొన్న. 67.
ధవళః. పు. ధవఅనెడి వృక్షము. 61-9; మద్దిచెట్టు. 40-చీనకర్పూరము. 61-12; ఆరెచెట్టు. 67, తెల్లచెరుకు; అలచందలు; స్త్రీ. తెల్లసుగంధిపాల. 40-1; వస; తెల్లదింటెన. 53-పావరోగాంతకరసమందు; పాలనేలగుమ్మడు; తవాక్షీరి; న. తెల్లమిరియాలు. 61-6.
ధవళఖదిరః. పు. వెలిచండ్ర
ధవళజా. స్త్రీ. తెల్లగురివెంద
ధవళపాటలీ. స్త్రీ. తెల్లకలిగొట్టు. 61-10.
ధవళపునర్నవా. స్త్రీ. తెల్లగలిజేరు. 20.
ధవళమృత్తికా. స్త్రీ. బలపపురాయి 61-13.
ధవళయావనాళః. పు. తెల్లజొన్నలు. 61-16
ధవళయూథికా. స్త్రీ. తెల్లఅడవిమొల్ల
ధవళశారిబా. స్త్రీ. తెల్లసుగంధిపాల. 67.

ధవళాఖ్యః. పు. నీరుల్లి

ధవళేక్షుః .పు. తెల్లచెరుకు. 61-14.

ధవళోత్పలం. న. తెల్లకలువ. 61-10

ధ్వాంసీ. న్. పు. చిట్టీను, 75.

ధ్వజః } పు. తాటిచెట్టు.
ధ్వజద్రుమః } 61-9

ధ్వజలాలా, సీ, వెను స

ధ్వజవృక్షః. పు. మాడయునే చెట్టు 61-9.

ధ్వనిబోధకం (వం). న. వాస నగొడుగుగడ్డి. 67.

ధాంధా. సీ. ఏలకులతీగె. 72

ధాతక్యభిషుతం న. ఆరెపువ్వు తో చేయబడిన మద్య విశే షము. 22-సూ-37 అ

ధాతకిః (కీ). సీ. ఆరెచెట్టు. 61-6; ఆరెపువ్వు

ధాతకీకుసుమం } న. ఆరెపువ్వు
ధాతకీపుష్పం } 86 సూ 88అ

ధాత్రికా. సి. ఉసిరిగ 61-11

ధాత్రీ. సీ. ఉసిరిగ 61-11; ఆరెచెట్టు; గోగు

ధాత్రిపత్రం. న. తాళీశపత్రి 61-6; ఉశిరిగాకు

ధాత్రీఫలం. న. ఉసిరిగకాయ 42-1; సీ. ఉసిరిగచెట్టు 61-11

ధాత్రీశ్వరీ సీ. ఆరెచెట్టు 61

ధాతుః. పు. స్వర్ణాదిధాతు సామాన్యము-40; గైరిక ము-మణిశిల-మొ॥ అశ్మ వికారము-33; శిలాజతు

ధాతుకం. న. శిలాజతు 67

ధాతుకంటకః.పు-ఇత్తడి

ధాతుకాశీషం } న. అన్నభేది
ధాతు కాసీసం } 61-13

ధాతుకీ-సీ-అరెచెట్టు-67

ధాతుగ్రాహీ-న్-పు. ఖర్పరం చూ-67.

ధాతుచేతనకరం. న. ఉశిరిగ

ధాతుజం. న. శిలాజతు. 67.

ధాతుద్రావకం.న. వెలియార

ము 67
ధాతుపుష్పీ (ష్పికా)-స్త్రీ-ఆరె
చెట్టు-33
ధాతుమలః-పు-సీసము-68
ధాతుమారిణీ. స్త్రీ వెలిగార
ము 73
ధాతుమారీ-న్-పు-గంధకము
ధాతుమాక్షికం.న స్వర్ణమా
క్షికము 61-13; అన్నభేది
67; పుష్పాంజనము
ధాతుమాక్షికం-న-స్వర్ణమా
క్షికము
ధాతువల్లభం-పు- వెలిగార
ము 33
ధాతువిట్-శ్-స్త్రీ-67 } సీ
ధాతువిశోధనం-న } సము
ధాతువిషం - న-హారిదళము
మొ॥ధాతురూపమగు విష
సామాన్యము-59
ధాతువైరీ-న్-పు - గంధకము
ధాతుశేఖరం-న-అన్నభేది-93
ధాతుశోధనం,న, సీసము,67
ధాతుశోధనకరీ.స్త్రీ కరక్కాయ
ధాతుసంధికరః.పు, వెలిగారం
ధాతుసంభవం, న. సీసము 67
ధాతుస్తంభనకరం,న, జాజికా
య 67
ధాతుహా,న్,పు,గంధకము,67
ధాతూపలః,పు.బలపపురాయి
ధాతృపుష్పీ (ష్పికా),స్త్రీ, ఆరె
చెట్టు
ధాత్రేయీ (యికా),స్త్రీ,ఉశిరి
క, 61-11
ధానకం,న,ధనియాలు-42-2
ధాన్యం-పు-ధనియాలు-61-6
స్త్రీ-ప్ర-1-2;న-నేల ఉశిరిక
61-23; వరిమొక్క; వరి
మొ॥ ధాన్య సామాన్యం
61-16; కైవర్తముస్తలు
సైంధవలవణము
ధాన్యకం-న-ధనియాలు-42-2
ధాన్యకంచుకీ-న్,పు-ధాన్యము
లపైపొట్టు 61-16
ధాన్యకతండులః-పు-ధనియాల

బియ్యము ౹౹పాత్రితధాన్యక తెండులక్వాథః" 40-2 అం తకజ్వర-చి

ధాన్యకల్కః,పు-ధాన్యములపై పొట్టు 68

ధాన్యజం-న-ధాన్యము-61-6

ధాన్యతైలం. న. గోధుమలు- జొన్నలు - యవలు-మొ౹౹ వాటి తైలము. 61-15

ధాన్యబీజం. న. ధనియాలు

ధాన్యమంజరీ. సీ. జొన్నలు మొ౹౹ వాటివెన్ను. 68.

ధాన్యమద్యం. న. ధాన్యము చేజేయబడిన మద్యము. 61-14

ధాన్యమాషః-పు.బోడశనగలు మినుములు-67

ధాన్యరాజః-పు.యవలు61-16

ధాన్యవీజం-న.ధనియాలు61-6

ధాన్యవీరః-పు-మినుములు 61-16

ధాన్యశాకం,న,కొత్తిమిరి58-9

ధాన్యశీర్షకం-న- ధాన్యమంజరీ చూ

ధాన్యశ్రేష్ఠం-న హేమంతశాలియనెడి శాలిధాన్యభేదం 61-15

ధాన్వనం-న-తచ్చెట్టుయొక్క ఫలం 68

ధానాః-సీ-నిబ-వ,వ, ధనియాలు 40; లేతమొలకలు

ధానాకాః.సీ, నిబ, ధనియాలు "ధానాకారక్తచందనం 68 సూ. 15.

ధానాలీ. సీ. వృక్షవిశేషము.

ధాన్యాకం. న. ధనియాలు. 42-2; కొత్తిమిరి. 54-11 అ. 121 శ్లో.

ధాన్యాగ్రం. న. ధాన్యమంజరీ. చూ.

ధాన్యాసవః. పు ధాన్యములతో జేయబడిన ఆసవము ఇది ఆరువిధములు "సురాసౌవీర తుషోదకమై రేయ

మేదక ధాన్యాంబు పష్ఠా
ధాన్యాసవాభవంతి"
22-సూ-25.
ధానికా. సీ. ధనియాలు. 67.
ధానీ, ఈ. పు. ప. ఈ. సీ.
పచ్చిధనియాలు సీ. ప్ర.
42-2; ప్న. గొలుగుచెట్టు.
ధానుష్యః. పు. వెదురు. 61-8
ధానుష్కా. సీ. ఉత్తరేణిచెట్టు
ధానేయం (యకం). న. ధని
యాలు. 61-6; పచ్చిధని
యాలు. 67.
ధాన్యోత్తమః. ప్న. శాలిధా
న్యము. 61-16.
ధామకం. న. కామంచిపూరి;
వాసన గొడుగుగడ్డి. 61-8
ధామనవృక్షః. పు. వృక్షవిశేష
ము. అను. పుల్లమామిడి. మూ.
సారపాదపః. చూ. 68.
ధామనీ .సీ. కొలపొన్న
ధామార్గవః. పు. ఆవడ 38;
ఉత్తరేణి, ఎఱ్ఱఉత్తరేణి 40-1
పెద్దబీర 61-7; నేతిబీర 91
ధారః. పు. పాషాణవిశేషము
68; సీ తిప్పతీగె 67; పస
పు 27; ఉశిరిక 40-1
క్షీరకాకోళి 67
ధారణీ (ణీయా) సీ ధరణీ
కందము 61-7; బ్రాహ్మి.
ధార్తరాష్ట్రపదీ. సి. హంసపా
ది 61-5; ఎఱ్ఱమంజుగు
దామర 67
ధారాకదంబః (బకః) పు క
దంబవృక్షభేదము 61-9
ధారాకోశాతకీ సీ. బీర
ధారాఫలః పు మంగచెట్టు
61-8; కర్మరంగి; నల్లమద్ది
సీ. బీర 61-7
ధారాసత్వం. న. తిప్పతీగె స్వ
రసము 67 క్షయ. చి. సె
వంతిపాక మందు
ధారాస్నుహీ. సీ. త్రిధారి అ
నగ ముమ్మపలకల జెము
డుచెట్టు 61-8

ధ్మాం(ధ్వాం)క్షోళీ, సీ- కాకో ళి, 33; గింజలులేనిద్రాక్ష (కిశిమిశి) 68
ధ్యామం- న- దమనము- 45; కామంచిపూరి, 33 దూది 86 సూ 25
ధ్యామకం. న. కామంచిపూరి 33; గాడుగుగడ్డి 22 సూ15
ధ్యాయం. న. కామంచిపూరి
ధ్వాంతశాత్రవః. పు. శ్యోనాక వృక్షము 72
ధ్వాంక్షకాకోళిః .పు. కాకిచె రుకు
ధ్వాంక్షతుండఫలా . పీ . కాకి దొండ
ధ్వాంక్షనఖః .పు .గురివెంద
ధ్వాంక్షనఖీ.సీ. ధ్మాంక్షనఖ చూ కాసరచెట్టు
ధ్వాంక్షనాసికా సీ ధ్మాంక్షనా సా. చూ; విత్తుబోడతరం
ధ్వాంక్షా. సీ. తెల్లగురివెంద
ధ్వాంక్షీ. సీ. ధ్మాంక్షీ చూ; తకోకలములు
ధీమోదినీ. సీ. మద్యసామాన్య ము 61-14
ధీరః పు ఋషభకమనే దుంప 61-5; న కుంకుమపువ్వు 27; పుష్కరమూలము 67; సీ మేదయనే దుంప 33; పెద్దవెక్కుడుతీగె; కాకోళి 61-3; క్షీరకాకోళి 67; ఇరుగుడుచెట్టు 33; నల్లఇరుగుడు 61-9, తెల్లవన; ముళ్లచేమంతి 67; మద్యవిశేషము 61-14 .
ధీరావీ. సీ. పచ్చఇరుగుడు 67
ధీవరీ సీ పెద్దపీచర 61-4
ధీహరా సీ అందుగుడుచెట్టు 67
ధుకః. పు. నేలరేగుచెట్టు 67
ధుకంధుకం న గంగరేగుపం డు 42-6
ధుకీ. సీ. నేలరేగుచెట్టు;పనుగు

రేగుచెట్టు 42-6
ధుత్తు (త్తూ)రః.పు. ఉమ్మెత్త
దురంధరః.పు.ధవఅనెడివృక్షం
ధురణీఫలః.పు. పెనగచెట్టు 33
ధుర్ధరః } .పు ఋషభకమనే
ధుర్యః } దుంప 61-5
ధుస్తు(స్తూ)రః.పు. తెల్లఉమ్మె
త్త 61-10; వం"ఘేంటు
గాఛ్" అనెడిమొక్క
రసద్రతైలమందు ౬౩
ధ్రువః.పు.ధవఅనెడి వృక్షము
47 మఱ్ఱిచెట్టు 42-5; జీవ
కమనుదుంప 68; మొర
డు, మోటు; సీ.ముయ్యా
కుపొన్న 61-4; చాగ 45
ధ్రువసాధనః .పు. లేకుచెట్టు
ధూకః.పు. పొగడచెట్టు 68
ధూకావాసః.పు. భరణిచెట్టు
ధూణతైలం .న.అందుకు జిగు
రునుండి తీసిన తైలము
మూ. కరాళః 65; సర్జరస
తైలము 68

ధూనకః (నః) .పు.సర్జరసము
(సాంబ్రాణి) 27
ధూనరాజః .పు.రూమిమాస్తకి
చెట్టు
ధూపకం .న. గంగరావి
చెట్టు61-9
ధూపగంధికం (నం) న. కా
మంచిపూరి 68
ధూపద్రుమః .పు. ఎర్రచంద్ర
ధూపనః.పు. సర్జరసము 74
ధూపనిర్యాసః .పు. అందుగు
జిగురు
ధూపవృక్షః (క్షకః).పు. ఎర్ర
చంద్ర 61-8; దేవదారు;
సరళదేవదారు 27; 75:
శ్రీవేష్టకము
ధూపసంళా. సీ 67 } ధూపోప
ధూపాంగః 61-12 } యుక్తస
రళదేవదారు భేదముఅన
గా శ్రీవాసమునకు హేతు
భూతమగు వృక్షవిశేషము
వం.టార్పేన్టాఇన్గాఛ్

ధూమ్రపర్ణ [ర్ణీ] .పు.సిహ్లాక ము 61-12

ధూమాంగః .పు నల్లఇరుగుడు

ధూమ్రాఖ్యా [హ్వా] .సీ. పొగాకు 61-౫

ధూమ్రికా .సీ. నల్లఇరుగుడు

ధూమోత్థం .న. నవాసార ము 61-6

ధూర్తః పు. బిడలవణము న-ప్ర-61-6; పు. తెల్లలేక నలఉమ్మెత్త ౬౭; మద్దిచెట్టు; బూడిదగుమ్మడికాయ 67; చోరకము; 61-12; గుగ్గిలము; సుహిమావతీగుగ్గి లము; -న- మండూరము; 92; సీ. తెల్లవావిడు 67; నల్లగరికి

ధూర్తకః .పు. నల్లఉమ్మెత్త; కేళికదంబ మనెడి కదంబ భేదము ౬౮; న. బిడలవణము

ధూర్తకృత్ -త్ -పు-ఉమ్మెత్త చెట్టు 74

ధూర్తపత్రీ .సీ. గంజాయి

ధూర్తమానుషా .సీ. రాస్న

ధూర్తరః .పు. పాదరసము 61-13

ధూర్తపధూః .సీ. గంజాయి

ధూర్ధరః } .పు. ఋషభకము
ధూర్యః } 67; ధవఅనెడి వృక్షవిశేషము ౬8

ధూర్వహః .పు. ధవఅనెడి వృక్షవిశేషము 68

ధూలకం .న. విషసామాన్యము 7౪

ధూలికః .పు. కడిమిచెట్టు; సీ. పుప్పొడి 67

ధూలికదంబః -పు- మొగలు కమిడి; నెవిస్త్రచెట్టు; ఉలిమిడిచెట్టు 68

ధూళిపుష్పికా .స్త్రీ మొగలిచె
ట్టు 61-10; తెల్లమొగ
లి 67

ధూళికదంబః [బకః] .పు. 45
ధూళీకదంబః.చూ

ధూసరః .పు. పచ్చపెసరభేద
ము 67; .స్త్రీ. పాండుఫలి
యనే వృక్షము 61-5

ధూసరచ్ఛదా.స్త్రీ. గండలియ్యా
33; తెల్లపువ్వులుగల రా
స్న 67

ధూసరపత్రీ [త్రికా] స్త్రీ. తే
లుమణిచెట్టు; శివబ్రహ్మి
యనెడి బ్రాహ్మిభేదము
33; హస్తిశుండి 61-5

ధూసరముద్గః .పు. పచ్చపెస
రభేదము 61-16

ధూస్తూరః .పు. ఉమ్మెత్తచె
ట్టు 33

ధృతరాష్ట్రపదీ .స్త్రీ. హంసపాది
ధృవః .పు. ధ్రువః చూ

ధేని [న్కి] కా 40 } స. ధని
ధేనుకా 42-2 } యాలు

ధేనుకారిః .పు. నాగకేసరవృ
క్షము 67.

ధేనుజిహ్వా .స్త్రీ. ఎద్దునాలికచె
ట్టు 61-4; అందపుష్పి
యనే చెట్టు

ధేను [నుకా] దుగ్ధం. న
బుడుమ 40

ధేనుదుగ్ధకరః .పు. మజ్జరమను
తృణవిశేషము 61-8;
గాజరగడ్డ 68

ధ్మాతం .న. వెండి 61-13; ని
లవర్ణముగల అన్నభేది 67.

ధ్మాతఖండీ .స్త్రీ. పటికపంచ
దార 67

ధ్మాతశి (శీ) లం. న. స్ఫటిక
మణి 27

ధ్మాతాంజనీ .స్త్రీ. ధ్మాతాంజని
యనే మూలికా భేదము
మూ. త్ర్యంకటం 65

నందివృక్షః .పు. నందివృక్షము; ఒద్ది శిశి; మర్రిచెట్టు

నందీ -న్-పు-ప-ఈ-సీ- తూనిచెట్టు; మర్రిచెట్టు; జువ్విచెట్టు 68; కలజువ్వి; గుచ్ఛకరంజమనెడి కానుగుచెట్టుభేదము 61-9; తెల్లఉత్తరేణి. 61-4; నందియనెడి నల్లవ్రీహి ధాన్యభేదము

నందీకాముకః .పు. పానీయామలకము; 67

నందీముఖః .పు. వెదురుధాన్యభేదము; వ్రీహిజాతిభేదము 86-సూ-46; పస్శూకరహితమగు గోధుమలు -పు - ప్ర - 67-సీ-ప్ర 40; .సీ. శూకరహితయువలు 68; గోధుములు 67

నందీముఖగోధూమః .పు.శూకరహితగోధుమలు

నందీముఖీ .సీ. అల్పగోధుమలు; తృణధాన్యవిశేషము

నందీముఖశబ్ద .సీ. చూ;

నందీవర్తః .పు. గంధితగరము 67

నందీవృక్షః .పు. నందివృక్షము.వం "యూఅశ్వత్థ" 33; తూనిచెట్టు ఇయ్యది కొంకణదేశప్రసిద్ధమగు సుగంధవృక్షవిశేషము "నందీవృక్ష పలాశకచ్ఛురాః" 63-సూ-15; చల్లగుమ్మడు 86-సూ-38 అంబష్ఠాది వ; ఒద్దిచెట్టు

నక్తంచరః .పు. గుగ్గిలము; బావంచి 68

నక్తకః .పు. ఉత్తుక 5

నక్తమాలః .పు. పెద్దకానుగుచెట్టు 61-9; రేలచెట్టు;పిన్నకానుగుచెట్టు; -సీ-ము ణుగుదామర

నక్తమూలకం .న. కానుగుచెట్టువేరు; .పు. పెద్దకానుగు

చెట్టు 67
నఃశ్రీః .పు. పర్పాటకము; తే
లుమణిచెట్టు.ప. ఉద్దిచెట్టు
భేదము
నక్రదంష్ట్రికా .సీ. తేలుమణి
చెట్టు
నక్రదమనీ .సీ. గొడ్డుఆగాకర.
నక్తాంధ్యశమనం .న. ఆవిశి
పువ్వు
నక్తా .సీ. చన్నచర్లగడ్డ 61-4
"గుల్ బాన్" అనెడి తృ
ణవిశేషము 67; పసపు68
నక్తాహ్వాః పు. కానుగుచెట్టు
నకులప్రియా .సీ. సర్పాక్షిభే
దము
నకులశ్రేష్ఠా .సీ. గంధనాకులి
61-7; గంధనాకులియను
దుంప
నకులాసాదనీ,సీ,కటుకరోహిణి
నకులీ .సీ. బూరుగచెట్టు 67
గండలియ్య 31; కుంకు
మపువ్వు 93; జటా
మాంసి 45
నకులేష్టా [ష్టకా] .సీ. రాస్న
2; నాకులి; పెద్దసర్పాక్షి
నఖం .ప్న. చిన్నచిక్కుడు
67;.న. పత్రసామాన్యము
నఖగుం [పుం] జఫలా } సీ
నఖగు [పు] చ్ఛఫలా } తెల్ల
చిక్కుడు 61-7
నఖచ్ఛేద్యా .సీ. మేద 61-5
నఖనామా .న్.పు. నీలవృక్ష
ము 67
నఖనిష్పావః .పు. } తెల్లచిక్కు
నఖనిష్పావికా .సీ. } డు 61-7
నఖపర్ణీ .సీ. తేలుమణిచెట్టు 68
నఖపుంఖీ .సీ. స్పృక్కయనే
గంధద్రవ్యము 61-12
నఖపుంజఫలా.సీ. తెల్లచిక్కుడు
నఖపుష్పీ .సీ. స్పృక్కయనే
గంధద్రవ్యము 61-12;
చన్నచర్లగడ్డ
నఖపూర్వికా-సీ-వం- "హరి
తవర్ణవటీ" అనెడి చిక్కు

డుభేదము అను గోరుచి
క్కుడు 61-7
నఖఫలినీ .సీ. చిక్కుడు
నఖరంజకః [నః] పు } ఎఱ్ఱ
నఖరంజ [జి] నీ. సీ } గోరిం
టె 28
నఖరాహ్వః .పు. తెల్లగన్నేరు
చెట్టు 61-10
నఖరీ .సీ. చిన్నచిక్కుడు 67
నఖవృక్షః-పు-నీలవృక్షము
61-9
నఖాంగం -న- నళియనెడి గం
ధద్రవ్యము 47
నఖాలుః -పు- నీలవృక్షము
నఖీ ఈ -పు- రేగుచెట్టు
నగః .పు. వృక్షసామాన్యము
నగకర్ణీ .సీ. తెల్లదింటెన 67
నగగంధా .సీ. రాస్న 67
నగజా .సీ. చిన్న తెలకపిండి
మొక్క 61-5
నగజిత్ .త్. .పు. తెలకపిండి
మొక్క 61-5
నగణా .సీ. జ్యోతిష్మతి 47
నగపతిః .పు. తాటిచెట్టు 67;
పనసచెట్టు 68
నగపర్యాయకర్ణీ .సీ. తెల్లదిం
టెన 67
నగభిత్ .ద్. .పు. పిండికొండ
61-5; హస్తజోడియనెడి
పిండికొండభేదము 67
నగభూః.ఊ. .పు. పిండికొండ
61-5
నగభేదనః .పు. హస్తజోడియ
నెడి పిండికొండభేదము 67
నగభేదీ .న్. పు. పిండికొండ
నగమాలః .పు. శాలిధాన్యభే
దము 14
నగరాహ్వం .న. శొంఠి 61-6
నగరోత్థా .సీ. నాగరముస్తలు
నగరాపధిః .సీ. అరటిచెట్టు
నగవృత్తికః .పు. తేలుమణిచె
ట్టు 86-సూ-20; సీ- అం
దగుచెట్టు 86-చి-15
నగవృశ్చికా సీ. తేలుమణిచె

ట్టుభేదము

నగ్నహూః .ఉః. -పు- నానా ద్రవ్యకృతసురాబీజము 68

నగాశ్రయః -పు- హస్తికంద మునుదుంప 6-7

నగ్నికా -స్త్రీ- రెడ్డివారి నాను బాల 68; ప్రత్తిచెట్టు

నగోద్భవః -పు- అడవిమాదీ ఫలము

నఘుషం -న- గ్రంధితగరము

నటః -పు- అశోకవృక్షము 61-10; శ్యోనాకవృక్షము .2; లొద్దుగచెట్టు; పెద్దకిక్కిసగడ్డి 24; న. కైవర్తముస్తలు 61-8

నటపత్రికా .స్త్రీ. వంగచెట్టు

నటపర్ణం .న. దాల్చినిచెక్క

నటభూషణం .న. హరిదళము

నటమండనం .న. గోదంతహరితాళము. 3, హరిదళము. 61-13.

నటసంజ్ఞకః .పు. 67 } హరిదళము
నటసౌరభవత్ .న. }

నటాఖ్యః .పు. శ్యోనాకవృక్షము 68

నటిః .పు. దుండిలము; మరిచెట్టు

నటీ .స్త్రీ. పగడపుతీగె 61-12 అశోకవృక్షము 67; కిక్కిసగడ్డి

నడః .పు కిక్కిసగడ్డి 61-8

నతం .న. గ్రంధితగరము. నపి "భద్రదారునతంకుష్ఠం" 63-సూ-15; పియంగుఅనగా పేంఖణము-22-చి-3-114 శ్లో

నతద్రుమః. పు. తీగెమద్ది 47

నతాంగీ .స్త్రీ. కర్కాటకశృంగి 42-1

నద్యం .న. స్రోతోంజనము 67

నద్యామ్రః .పు. ఏరువంగ

నదీకదంబః .స్త్రీ. గోరక్షముండీ. చూ; పెద్దబోడతరము

నదీకాంతః .పు. నీటిగన్నేరు 61-8; నీటిపేము 67; వావిలిచెట్టు-45; .సి. చీకివెలగ 61-4; పొట్టికాకిర; నేరేడుచెట్టు 45; మరాతీమొగ్గలు; పేరింఖణము

నదీకుశేరకః .పు. చందివృక్షము 61-12

నదీకూలప్రియః .పు. నీటిపేము 24

నదీజం .న. స్రోతోంజనము 63; బ్రహ్మమేడి. పూ ఫల్గునః; .పు. మద్దిచెట్టు 33; జొన్నలు; నీటిగన్నేరు 61.8; ఏటిఅనుములు 61-16; ఖర్జూరపుచెట్టు 67; విటమాక్షికము అనగా -అను- తాపమాక్షికము 68; సీ. పెద్దనెల్లిచెట్టు

నదీనః .పు. ఉలిమిడిచెట్టు 63

నదీనిష్పావః (వకః) .పు. ఏటిఅనుములు 61-16

నదీబహులః .పు. మద్ది 67

నదీభల్లాతకః .పు. ఏటినల్లజీడిచెట్టు 33

నదీమంజుః .పు. మద్దిచెట్టు

నదీమాషకం .న. శాకవిశేషము. 22 సూ. 27

నదీయా .సీ. పెద్దనెల్లిచెట్టు 61-9

నదీవటః .పు. చిన్నఆకులుగల మర్రిచెట్టుభేదముఅనగా నల్లమర్రి 61-11

నదీవాసః .పు. కంపిల్లమనేచెట్టు

నదీవీరణః .పు. అవురుకసవు

నదీసర్జః -పు- మద్దిచెట్టు 61-9 ఏటుమద్ది

నద్యుదుంబరికా .సీ. ఏటిమేడిచెట్టు

నదేయా .సీ. నీటిపేము 67; నేలనేరేడు 72

నప్త్రికా .సి. తిప్పతీగె 67

నభం .న. పద్మము 61-10

నభః_న్-. న. పద్మము; అభ్ర కము 67; నీళ్లు
నభాః .స్.పు. బిసతంతువు
నభోభలీ .క.పు జీడిచెట్టు
నమస్క [న_] .రీ. సీ.దగ్ధ పుచ్ఛి .చూ ముణుగుదామర
నమస్కారః .పు. విషభేదము
నమస్కారీ సీ. నిద్రభంగి 33; తెల్లముణుగుదామర 61_5; నల్లగరిక 67
నమ్రః [మ్రక] -పు- ప్రిబ్బలి
నమేరుః .పు. సురపొన్న 61_10; సరళ దేవదారు67 రుద్రాక్షచెట్టు 68
నయనప్రసాదః .పు. ఇండుపు చెట్టు 67
నయనౌషధం .న. తెల్లఅన్నభేది 93
నరః .పు. నీలవృక్షము 61_9 న. నిమ్మగడ్డి 45
నరటంగణం .న. నవాసారము
నరనామా .క. పు. నీలవృక్షము 38
నరప్రియః .పు నీలవృక్షము 61_9; దానిమ్మ
నరవృక్షః .పు. నీలవృక్షము 61_9
నరనాగరకః } పు. నవాసారము
నరనాదరః, 41 } పు. నవాసారము
నరసారః 59 } పు. నవాసారము
నర్తకః .పు. కిక్కసగడ్డి 75; చోళ్లు; దుండిగపుచెట్టు; సీ. నళికయనెడి గంధద్రవ్యము 61-13
నర్తకీ .సీ. నళికయనెడి గంధద్రవ్యము 61-13
నర్మటః .పు. పాలతుత్థము 90
నర్మదా .సీ. స్పృక్కయనేగంధద్రవ్యము 93
నర్మరా .సీ. తెగడ 45
నరాంగమేదినీ సీ.జటామాంసి
నరాధిపః .పు. పెద్దరేలచెట్టు 86 చి 37

నర్తాపహారకః-పు- ఘూళికదంబము 67

నరేంద్రః -పు- రేలచెట్టు. కాష్ఠాగరుఅనగా పచ్చఅగరు 86 చి 16. కృష్ణాగరు 27 ఋషభకము; పాలచెట్టు

నరేంద్రద్రుమః -పు- రేలచెట్టు 41 కుష్ఠ-చి

నరేంద్రాహ్వం -న- కృష్ణాగరు

నరేంద్రాహ్వాః -స్త్రీ- కాష్ఠాగరు

నలః -పు -కిక్కసగడ్డి 86 సూ 38 వ్యా; రెల్లుగడ్డి 86 సూ 38 తృణపంచమూలనుందు; తాళీశపత్రి 67 దశమూలాదితైలమందు; కదంబవృక్షము; మూదీఫలవృక్షము; తెల్లజొన్నలు; సుగంధతృణము అనగా నిమ్మగడ్డి 67; తృణధాన్యభేదము; న-పద్మము 61-10

నలకం -న- తామరపూస 67

పు- బటాణీలు -మూ-నాలకః 68

నలదం -న- వట్టివేళ్లువలెపచ్చనై నకురువేరు;నల్లవట్టివేళ్లు 40; మకరందము 45; స్త్రీ జటామాంసి -న- ప్ర- 86 సూ 38; సీ- ప్ర 61-12; వట్టివేళ్లు-న- ప్ర 45; సీ ప్ర 67; పు అవురుకసవు

నలదంబుః -పు- వేపచెట్టు 68

నలదాంబు -న- వట్టివేళ్లరసము 67

నలమూలం -న- అవురుకసవువేళ్లు

నలరంధ్రీ -స్త్రీ- పు చన్నచర్లగడ్డ

నలశ్రేణి -స్త్రీ- నల్లదింటెన

నల్వకీ-కః -పు- కిక్కసగడ్డి 41 యోనివ్యాపచ్చికిత్సలో

నల్వావర్తగా -స్త్రీ- చీకివెలగ

నలికః -పు- కిక్కసగడ్డి. 67

స్త్రీ ఏటిపుచ్చ. 61-3; నా
డీశాకము.67; పక్కెమునక
యనెడిసుగంధద్రవ్యము.
(ఇదివల్కల విశేషం) 41;
తెల్లవట్టివేళ్లు;ములువెంపలి
నల్ల తెగడ.

నళికాదళః .పు. బొప్పాయి
చెట్టు

నళికాపధికం.న. తెల్లవట్టివేళ్లు

నళికః .పు చేదురుచిగలనాడీ
శాకము 62

నళినః .స్త్రీ. పానీయామలకము
72; న. పద్మము 61-10
. తెల్లకలువ 24-సూ;-4
నల్లకలువ;జలము 93;పద్మ
కేసరములు 85-సూ-35.

నళినకేసరం.న పద్మకేసరము
లు 86- సూ-38

నళినీ .స్త్రీ.పద్మలత 61-10; నళి
కయనే సుగంధద్రవ్యము
67 అర్శశ్చికిత్సలో విడం
గాది చూర్ణలేహమందు,
కొబ్బరికల్లు 27;పద్మము;
ఆగాకర

నళినీదళం .న. తామరాకు68

నళినీరుహం-న-తామరతూడు
61 -10

నళీ[లీ]-స్త్రీ- నళికయనేసుగంధ
ద్రవ్యము 61-12;ఆగాకర; మ
ణిశిల 65

నళీరుహం .న- తామరతూడు

నలుకా -స్త్రీ-నళికయనేగంధద్ర
వ్యము; జాజికాయలచెట్టు

నళోత్తమః. పెద్దకిక్కసగడ్డి

నవః-పు-ఎర్రగలిజేరు61-5

నవగంధికా-స్త్రీ-విరజాజిలత 68

నవచ్ఛదం.న.కోమలమగుపత్రసా
మాన్యము. అనిహార్ద్రచం
ద్రుడు; పద్మకేసరములకు
సమీపమందున్న రేకులు 2

నవనీతం-న-కుందురుష్కము 41
గ్రహ - చి - బృహజ్జీరకా
ద్య మోదకమందు;-స్త్రీ-నవ
నీతకగంధియనుదివ్యౌషధి

నవనీతకం -ప్న-గంధకము 59
నవనీతకగంధీ -స్రీ- నవనీతా యను దివ్యౌషధి
నవనీతాఖోటీ సీ. కుందురుమ్మ భేదము. మూ. పద్మచారటీ
నవనీతాహ్వయగంధః.పు అమలసారగంధక మనెడిగంధక భేదము 59
నవపల్లవః పు. లేతచిగురుటా కు 68.
నవమల్లికా .సీ. విరజాజి. 61.10; మోదెన.
నవమల్లీ } సీ. విరజాజి
నవమాలికా } 61-10
నవమాలీ .సీ.విరజాజి. మూ. లూతామర్కటకః. 65
నవరత్నం. న. ప. బ. పద్మరాగము- ముత్యము-పగడము-గరుడపచ్చ - పుష్పరాగము-వజ్రము-నీలము గోమేదకము - వైడూర్యము
నవవల్లభం .న. దాహాగరు. 61-12.
నవశూకః .పు. తెల్లరాజనాలభేదము.
నవసాగరం. ప్న .67. } నవా
నవసారః .పు. 68 } సారం
నవ్యః .పు ఎర్రగలిజేరు. 61-5
నవాంగా .సీ. కర్కాటకశృంగి. 68.
నవాళీ .సి. విరజాజి. 6౫.
నహుసీ .సీ వృక్షవిశేషము. 68.
నహుషం. } న. గ్రంధిపర్ణ
నహుషాఖ్యం. } రము.
నక్షత్రకాంతివిస్తారః .పు తెల్లజొన్నలు. 61- ౯.
నక్షత్రమాలినీ .సీ. జాజిపుష్పలత. 67
నక్షత్రవృక్షాః .పు. బ. ముషిణిగ.ఉశిరిగ - మేడి-నేరేడు-చండ్రి-కృష్ణాగరు-వె

దుడు-రావి-నాగకేసరము
లు-మర్రి-మోదుగ - జువ్వి
పారతీగె-మారేడు - మద్ది
కాండ్రేగు-సురపొన్న-లొ
ద్దుగ-ఏపి-పేము-పనస -జి
ల్లేడు-జమ్మి - కదంబము
మామిడి-వేప-ఇప్ప-ఇవి క్ర
మముగా అశ్విన్యాది నక్ష
త్రములధి దేవతలు గాగల
వృక్షములు. 73-అనూప
వర్గు

నక్షత్రాళ్యతివిస్తారః. పు తె
ల్లజొన్నలు.

నక్షత్రేశః పు కర్పూర
ము. 2.

న్యంకుః .పు. మృగ విశేష
ము. 45.

న్యంకుభూరుహః .పు రేలచెట్టు
67; శ్యోనాకవృక్షము. 27.

న్యగ్రోధః పు. మర్రిచెట్టు
జమ్మిచెట్టు. 45, విషపర్ణి
యనెడిఓషధి; మోహన

మనెడి ఓషధిఅనగా ఈస్మో
త్త. 65; స్త్రీ. ఎలుకజీడి
కూర .పు. ప్ర. 61-23;
సీ. ప్ర. 63.

న్యగ్రోధావర్ణీ. } సీ. ఎలు
న్యగ్రోధికా.61-3 } జీడి
కూర

న్యగ్రోధీ. స్త్రీ. పు. వ. ఈ.
సీ. పెద్దదంతిచెట్టు. 61-5;
ఈ. సీ. ఎలుకజీడికూ
ర. 61-4

న్యక్షం .న. తృణసామాన్య
ము. 45.

నాందీముఖీ. సీ. నందీముఖము
లనెడియవలభేదము."నాం
దీముఖీ మధూళీచ మదు
రాస్నిగ్ధశీతలా" 22.

నాకతుషారః.పు. కర్పూరము

నాకనః. పు. వెదురుధాన్య భే
దము. 33.

నాకుః. పు. పుట్టమన్ను. 41.

నాకులీ. సీ. నాకులీకందమను

దుంప. 33; గంధనాకులి; రాస్న-61-4; చవ్యము 33; మిరియాలు; బూరుగ చెట్టు. 45; గండలియ్య; తెల్లములక; కుక్కుటీకంద మనుఓషధివిశేషము.

నాకులీద్వయం. న. నాకులి గంధనాకులి "వయస్థానాకులీద్వయం" 85-ఉన్మాద

నాగః. ప్న. సీసము; వత్సనాభమనువిషము; నాగకేసరములు. 33;తగరము .పు. జబిలికబీర; మేదయనేదుంప; తుంగముస్తలు; సురపొన్న చెట్టు. 45; తమలపాకులతీగె. 5; వేగిశచెట్టు. 61-23; న. నాగాభ్రకము 45; సీ. నాకులి; పుత్రదాత్రియనులత; పొత్తిదుంప 67.

నాగకందః. పు. హస్తికంద మను దుంప 61-7;

నాగకన్యా. సీ. తిప్పతీగె

నాగకర్ణః .పు ఎఱ్ఱఆముదపు చెట్టు. 61 6; హస్తికర్ణ మను మోదుగుభేదము 64

నాగకర్ణీ .సీ. ఎలుకచెవికూర 61-3; తెల్లదింటెన.73.

నాగకింజల్కం .న. నాగకేసరములు .61-8

నాగకుమారీ (రికా) .సీ. తిప్పతీగె .61-3; మంజిష్ఠ 61-6.

నాగకుసుమం .న. నాగకేసరములు. 67.

నాగకృష్ణా .సీ. గజపిప్పి. 67.

నాగకేశ(స)రః .ప్న. } నాగ
నాగకేశ(స)రకః .పు. } సంపెంగ 61-6; నాగకేసరములు; న. కాంతలోహము. 68

నాగగంధా .సీ. నాకులీకంద మనుదుంప 61-7; నాకులి; ఈశ్వరీలత; నాగదమనము

నాగగర్భం .న. గంగసిందూ
రము 61-13
నాగచ్ఛత్రిః .స్న. నాగదంతి
61-5; .సీ. తమలపాకులతీ
గె 67.
నాగజం .న. గంగసిందూరము
33; తగరము 93.
నాగజంబూః .సీ నేలనేరేడు
నాగజిహ్వా .సీ సుగంధిపాల
41 వాతవ్యాధి-చి; మణిశి
ల 61-12; నాగజిహ్వాయ
నే చెట్టు
నాగజిహ్వికా .సీ. మణిశిల 33
నాగజీవనం .న. తగరము 93
నాగజీవనశత్రుః .పు. తాళక
ము 67
నాగత్వక్ .చ్. సీ. లవంగ
పట్ట
నాగతుంబీ .సీ. నేలానప 67
నాగదంతికా .సీ. నాగదంతిచె
ట్టు .వం. "హాతిశుండి"
61-5; పెద్దవేళ్ళుగల దంతి
చెట్టుభేదము 21; తేలుమణి
చెట్టు 67
నాగదంతీ .సీ. నాగదంతిచెట్టు
వం "హాతిశుండి" 61-5;
పెద్దవేళ్ళుగల దంతిచెట్టుభే
దము 2 ; పెద్దపాపర; గు
రుగుచెట్టు; కాషపాటలాంఅ
నగా తెల్లకలిగొట్టు 52-చి
10-39 శ్లో వ్యా
నాగదమనీ .సీ. నాగదమనము
61-5; గొడు ఆనాకర 67
నాగదళం .న. నాగదమనము
41-తప్తరాజ తైలమందు;
సీ తమలపాకు 68
నాగదళోపమః .పు. చిట్టీదు
వం "పరూషఫల్" "పల
నాగాఫ్" 33
నాగదా .సీ. కరకచెట్టు 59
స్వచ్ఛందభైరవరసుందు
నాగదుః .పు. నాగజెముడుచె
ట్టు 72
నాగదానా. సీ. నాగదమనము

నాగదంతిచెట్టు 78
నాగనామకం .న. సీసము 40
నాగనామా .క.పు. తెల్లతు
లసి; కృష్ణతులసి 67
నాగపత్రం .న. తమలపాకులు
67; .సీ. నాగదమనము40;
లక్ష్మణాకందము 68
నాగపత్నీ .సీ. లక్ష్మణాకంద
ము 61-17
నాగపత్రీ .సీ. నాగదమనము
67; లక్ష్మణాకందము
నాగపర్యాయకర్ణీ .సీ. తెల్లదిం
టెన 61-17
నాగపర్ణీ .సీ. తమలపాకులతీగె
నాగపుత్రీ .సీ. లక్ష్మణపంజి
నాగపురగం.న. సీసము 61-18
నాగపురీసచ్ఛత్రం .న యేను
గులద్దెలో బుట్టిన కుక్కగొ
డుగు 63 ఉ 37 అ
నాగపుష్పః -పు- సురపొన్న
45; నాగకేసరవృక్షము33,
నాగకేసరపుష్పములతో స
మానమైనపుష్పముగలమ
హావృక్షవిశేషము86 సూ
38;నాగసంపెంగ45;సంపె
గంచెట్టు న.నాగకేసరము
లు 22 చి 3; సీ నాగద
మనము; మణిశిల 67
నాగపుష్పకః .పు. నెలగచెట్టు
పచ్చఅడవిమొల్ల; బూడిద
గుమ్మడికాయ 61-23; సు
రపొన్న చెట్టు; నాగకేసర
వృక్షము 67
నాగపుష్పఫలా .సీ. బూడిదగు
మ్మడితీగె 61-7.
నాగపుష్పికా .సీ. పచ్చఅడవి
మొల్ల 61-10
నాగపుష్పి-సీ-నాగదమనం40;
పచ్చఅడవిమొల్ల 61-10;
నాగపుష్పి (ఇదియొక .పు.
ష్పవృక్షవిశేషము) 40
నాగపణిః .పు. నాగజెముడుచె
ట్టు 68-
నాగఫలః .పు. పొట్ల 61- ;

శేతిపాట్ల 67

నాగపేసం .న. నల్లమందు 67 అతిసార-చి- కుంకుమనటి యందు

నాగబంధుః .పు. మేడిచెట్టు 71; రావిచెట్టు 72

నాగబలః.పు- ఎఱ్ఱాముదపుచెట్టు 68; .సీ. జబిలికబీర

నాగభిన్నా
నాగభూః 61-5 } .సీ. కొండ పిండిమొక్క

నాగమతీ .సీ. కృష్ణతులసి 67.

నాగమధనీ.సీ. గొడ్డుఆగాకర

నాగమాతా.ఋ.సీ.సుగంధిపాల .67; మణిశిల. 93; తులసి.

నాగమారః.పు.గుంటగలగర.27

నాగముస్తా. సీ. నాగముస్తలు (తుంగముస్తల భేదము)

నాగరం. న. తుంగముస్తలు .45; కరక్కాయ. 81-సన్నిపాతజ్వర-చి; సీరునెల్లి; పు. నారింజచెట్టు. 75; పు. నాగిరముస్తలు సీ. పానియామలకము. 67; నల్లతెగడ;, స్న. శొంఠి, నప్ర.61-6;ప్ర.68.

నాగరంగః. 42-6.
నాగరకః 67.... } పు. నారింజచెట్టు; కమలాఫలముపుచెట్టు.

నాగరక్తం-న-గంగసిందూరం

నాగరఘనః. పు...
నాగరముస్తకం. న
నాగరముస్తా. సీ...
నాగరాదిః.పు.67
నాగరాదిఘనసంజ్ఞకా. సీ-68. } నాగరముస్తలు

నాగరాహ్వాం.న శొంఠి.61-6

నాగరికా .సీ. కమలాఫలపుచెట్టు. 40. మూ. నాదేయికా. 68.

నాగరీ. సీ. చెముడుచెట్టు 72.

నాగరీకనాశ్యా. సీ. గొడ్డుఆగా

కర. 67
నాగరుకః. పు నారింజ; కమలాఫలపుచెట్టు. 75.
నాగరూపప్రథం. న తాళకము 67
నాగరేణుః .పు. గంగసిందూరము 61_13
నాగరేణుకః .పు.నాగకేసరవృక్షము67; గంగసిందూరం 6 -13
నాగరోత్థా.సీ.నాగరము స్తలు "నాకరోత్థాకచ్ఛురుహా" 61-6
నాగరాషధిః .సీ. అరటిచెట్టు
నాగలతా .సీ. తమలపాకుల తీగె 68
నాగవధూః.సీ. అందుగుచెట్టు
నాగవధూప్రియః.పు.కుందుగు వృక్షము .పు. ప్ర. 67
నాగవల్లరీ .సీ. తమలపాకుల తీగె40
నాగవల్లీ(ల్లికా). సీ పం."నాగితాగాచ్" అనెడిప త్రశాకవిశేషము అనగా మెండిన వాడిశాకము 68: తమలపాకులతీగె 61_11
నాగవిన్నా .సీ తమలపాకులతీగె; నాగదంతి 61-ఉ_5
నాగస్ఫంతా(తికా). సీ. తేలుమణిచెట్టు 53
నాగశ్రీవల్లభః పు.కుందురువృక్షము 67
నాగశుండీ .సి. హస్తిశుండి67; ఎర్రఆనప; పొడుగుదోస 61-7
నాగసంజ్ఞకః .న. సీసము.
నాగసంభవం .న. గంగసిందూరము 2
నాగసత్వః .పు ఒద్ది 67; స_బోదారశృంగి
నాగసిందూరం.న.గంగసిందూరము. 53_6
నాగసుగంధా. సీ నాకులి; రాస్న. 5

నాగసూకః -పు- తగిరిశ.
నాగస్తోకకం-న- వత్సనాభము నెడివిషము. 68
నాగస్ఫోటా (తా) స్త్రీ.దంతిచెట్టు.61-6; నాగదంతిచెట్టు 61-5.
నాగహంత్రీ. స్త్రీ. గొడ్డుఆగాకర 61-7
నాగాఖ్యః .పు. నాగకేసరము లు 1-స్థానం-2-అ
నాగరాతిః.పు. గొడ్డుఆగాకర 61-7
నాగరిః.పు. దేవదాళి 67; గొడ్డుఅగార. 61-3
నాగఘ్నీ .స్త్రీ. పిన్నపాలభేదము అనగా రెడ్డివారినానుబాలభేదం 67
నాగాలాబుః-న్న-గుండ్రఆనప 61-7
నాగవ్హాః .పు. నాగరంగ 61-10; స నాగకేసరములు ,,సైలామధుకనా గాహ్వం" 63.సూ-15-అం జనాదిగ; -స్త్రీ- లక్ష్మణాకందము 61-7; తమలపాకులతీగె; నాగదమనము 67; లక్ష్మణపంజి
నాగాక్షీ -స్త్రీ- సర్పాక్షి
నాగినీ-స్త్రీ-నాగదంతిచెట్టు61-6 లక్ష్మణాకందము 31-7 తమలపాకుల తీగె; నాగపుష్పి 68; -ది-లక్ష్మణపాజి
నాగినీ-స్త్రీ.గొడ్డు ఆగాకర 67 జీర్ణజ్వర-చి-కళ్యాణ ఘృతమందు
నాగీయః పు- నాగకేసరము లు-పు-ప్ర-61-6
నాటామ్రః -పు- తరుబూజాలత 27
నాడః .పు. కిక్కసగడ్డి 61-8; చెట్లసంబంధమైన నాళము 22-సూ 1.
నాడిః స్త్రీ.సింహళదేశపుపిప్పలి; నాడీకమనుకూర; గరిక

భేదము 68 .పు. చెట్లసం బంధమైననాశము

నాడికం .స్న. నాడీకమనుకూర 40–శాక–వ;సీ.ప్ర. 67

నాడికేరః (లః) (లిః)–పు–కొబ్బరిచెట్టు 5

నాడీచీరం_న_ నళియనే గంధద్రవ్యము 90

నాడితిక్తః –పు_ తురకవేప; నేలవేము.

నాడిపత్రం .న. చేదురుచిగల నాడీశాకము 74

నాడీ_సీ_చెట్ల సంబంధమైననాళము, గండగరికి 45, పెద్ద హింగుపత్రి; బలపురాయి; నివరిధాన్యము

నాడీకః–పు–నాడీశాకమనుకూర 40 శాక_ప–వ; నాడీకమనుకూర 40

నాడీకలాపకః_పు_ సర్పాక్షిఅనగా వెంపలిభేదము 40

నాడీకలాయః _పు_ శకులాక్షము అనగాసువర్చలాభేదం

నాడీకేరః (లః)_పు_కొబ్బరిచెట్టు 75

నాడీచః_పు–చేదురుచిగల నాడీశాకమనుకూర_వం_"నాలితా' 'నాడీచ బీజకల్క' 41 క్షుద్రరోగ_చి;మధురరసముగల నాడీ శాకము వం ,,కచ్చు" 27

నాడీచబీజం _న_ చేదురుచిగల నాడీశాకముయొక్క విత్తనములు 41–పృథ్వీసారతైలమందు

నాడీతరంగః.పు. కాకోలమనెడి విషవిశేషము 45

నాడీతిక్తః_పు_ నేపాళదేశపునేలవేము _వం_ "చిరేతా"

నాడీశాకః _స్న_ నాడీశాకమనుకూర 62

నాడీహింగుః ,స్న. కారింగువ 61–6; హింగుపత్రి 33

నాదేయః .పు.నీటివేము 42–5

న;. నదముయొక్క గానినది యొక్క గానిజలము "న ద్యానదస్యవానీరం నాదే యామితికీర్తితం' సౌవర్చలలవణము 61-5; సముద్రపుఉప్పు; సైంధవలవణము 47; నీలాంజనము40; సౌవీరాంజనము; నాగరముస్తలు; ప్స రెల్లుగడ్డి పు. ప్ర 61-8; న. ప్రి. 61-23

నాదేయీ(యికా). స్త్రీ. నాగరముస్తలు61-6నేలనేరేడు 47నారింజచెట్టు; పెద్దనెల్లిచెట్టు;38; నీటిపేమురెల్లుగడ్డి; వారహీకందమను దుంప; ప్రబ్బలి 61-23నేలఉశిరిగ; ఆముదపుచెట్టు 67దానానిచెట్టు; చిన్న నెల్లి; కాకినేరేడు; చేతిపొట్లకమలాఫలపుచెట్టు 40

నానాకందః. పు. పెండలము 61-7

నానాధాతుమయీ. స్త్రీ. ఇసుక

నానాశృంగార వర్ధనః. పు. ఇంగిలీకము

నాపాకం. న. తామరపూస

నాభకః. పు. కరకచెట్టు 67

నాభసోదకం. న. బ్రాద్రపద మాసమందలివర్షోదకము

నాభికా. స్త్రీ నల్లకటభి 61-9

నాభిశంఖః. పు. శంఖనాభియనెడిసుగంధద్రివ్యము68

నాభీ. స్త్రీ. మద్యసామాన్యము

నామ. ౯. న. జలము

నామశుండీ. స్త్రీ. పొడుగుదోస

నారః. త్రి. జలము. పు. ప్ర 45. స్త్రీ. ప్రి. 75. పు. శౌరి 68

నారంగం. న. ఎర్రిముల్లంగి 61-7 నారింజపండు పిప్పిలీరసము45. పు. నారింజచెట్టు; కంచెఈడ; నారదబ్బ

నారంగవర్ణకం. న. ఎర్రముల్లంగి 40-శాక-వ

